14. నవంబరు : ఈ వారం 227 మంది భారతీయులు జైలుకు వెళ్ళారు. వారిలో 64 మంది జోహన్స్‌బర్గుకు 97 మంది జర్మిస్టన్‌కు 60 మంది ప్రిటోరియాకు 6 మంది తదితర స్థానాలకు చెందిన భారతీయులు.

17 నవబంరు 53 మంది తమిళులు కేకలు వేస్తు పట్టుబడ్డారు. వాళ్లకు 7 రోజుల జైలు శిక్ష విధించారు.

22. నవంబరు కలకత్తాలో శ్రీ అబ్దుల్ జబర్ అధ్యక్షతన సత్యాగ్రహులకు సానుభూతి తెలుపుతూ సభ జరిగింది

13 డిసెంబరు గాంధీగారు రెండు నెలల జైలుశిక్ష అనుభవించి విడుదల అయ్యారు

## 1909

9. జనవరి : దర్బనులో మర్క్యూరీ పత్రికా ప్రతినిధి గాంధీ గారిని కలిశారు. అతనికి, ట్రాన్స్‌వాల్‌కి చెందిన సుమారు 2000 మంది జైలుకు వెళ్ళి వచ్చారని గాంధీజీ చెప్పారు.

15 జనవరి గాంధీగారు నేటాలు నుంచి బాక్‌ర్‌స్ట్ వెళ్తూ మూడో సారి అరెస్టు అయ్యారు. కొద్దివారాల తరువాత కేసుపెట్టి 3 మాసాలు శిక్ష విధించారు. అదే రోజున హమీదియా సొసైటీ ఉపాధ్యక్షుడు 65 ఏండ్ల వయస్సు గల శ్రీ ఉమర్జీసాలే, డేవిడ్ ఎర్నెస్ట్ గారలకు 3 నెలల శిక్ష విధించారు.

29 జనవరి క్రూగర్స్ డ్రాప్‌లో ఖోల్వడ్ కాన్ఫరెన్సు జరిగింది. పత్రాలు తీసుకోకూడదని దుకాణాలు తెరవకూడదని నిర్ణయం గైకొన్నారు. జైలుకు వెళ్లాలని కూడా నిర్ణయించారు.

6. ఫిబ్రవరి : ట్రాన్స్‌వాల్ యందలి హాస్కెన్ కమిటీ, భారతీయులకు మేలు చేయాలని లండన్ టైమ్సుకు జాబు పంపింది.

10. ఫిబ్రవరి : రోడీషియాలో అంగీకరించబడిన చట్టాన్ని బ్రిటిష్ చక్రవర్తి నిరాకరించారు.

12 ఫిబ్రవరి : పారసీరుస్తుంజీ తదితర భారతీయులకు ఆరు మాసాల జైలు శిక్ష విధించారు.

6. మార్చి : తెల్లవాళ్లు బాక్స్‌బర్గ్, నార్‌వుడ్, బ్లూంఫొంటీన్, బార్బర్టన్, క్రూగర్స్ డ్రార్ప్‌లో లోకేషను స్థాపనకై ఉద్యమం ప్రారంభించారు.

10 మార్చి : డెల్‌గోవాబే మార్గాన భారతీయుల్ని దేశ బహిష్కరణకు గురి చేసి ఇండియాకు పంపివేయడం ప్రారంభించారు.

12. మార్చి : ప్రిటోరియాలో శ్రీమతి పిళ్లై కేసులో గాంధీ గారిని బేడీలు వేసి కోర్టుకు తీసుకు వచ్చారు.

5. ఏప్రిల్ 14 సెప్టెంబరు నుంచి 17 మార్చి వరకు వ్రాసిన దస్తావేజుల బ్లూబుక్ ప్రభుత్వం ప్రచురించింది.

30 ఏప్రిల్ : శ్రీ కాఛలియా మరియు 18 మంది యితర సత్యాగ్రహులు శిక్ష అనుభవించి విడుదలయ్యారు.

4. మే :సత్యాగ్రహఖైదీలకు జైళ్లలో నెయ్యి ఇవ్వడం ప్రారంభించారు.

24. మే గాంధీ గారికి మూడోసారి మూడు మాసాల జైలు శిక్ష విధించారు.

7. జూన్ : జర్మిస్టన్‌లో తెల్లవారి సభలో గాంధీ గారు సత్యాగ్రహ విధానం మీద మహత్తరమైన ప్రసంగం చేశారు.

16 జూన్ : జోహన్స్ బర్గ్‌లో జరిగిన బహిరంగ సభలో శ్రీ ఎ.ఎం. కాఛలియా శ్రీహాజీ అలీబ్, శ్రీ బి.ఎ. చెట్టియార్ మరియు గాంధీగారలను ఇంగ్లాండు పంపాలనీ, శ్రీ ఎ.ఎం. కామా, శ్రీ ఎన్.జి. నాయుడు, శ్రీ ఇ.యం. కుబాడియా, శ్రీ హెచ్.ఎస్. పోలక్‌ను భారత దేశం పంపాలని నిర్ణయించారు. యీ ప్రతినిధి బృందాలు బయలు దేరేందుకు ముందే శ్రీ కాఛలియా, శ్రీ కువాడియా శ్రీకామా, శ్రీ చెట్టియార్‌గారలను అరెస్టు చేశారు.

4. జూలై : జోహన్స్ బర్గ జైలునుంచి విడుదల కాగానే జైల్లో అనుభవించిన కష్టాలవల్ల, యాతనల వల్ల శ్రీ నాగప్పన్ చనిపోయాడు.

16. జూలై : ముజకరీ అనుస్టీమర్లో 14 మంది భారతీయుల్ని దేశాన్నుంచి బహిష్కరించి పంపి వేశారు.

1 సెప్టెంబరు : బొంబాయి షరీఫ్ దక్షిణాఫ్రికాలో జరుగుతున్న సంగ్రామాన్ని

గురించి చర్చించుటకు బహిరంగ సభను ఏర్పాటు చేశాడు. కాని బొంబాయి ప్రభుత్వం ఆ సభను జరుగనీయలేదు. యీ సభ 13 రోజుల తరువాత జరిగింది.

16. సెప్టెంబరు . ఇంగ్లాండులో ట్రాన్స్‌వాల్ భారతీయ ప్రతినిధి బృందం లార్డ్ క్రూని కలుసుకున్నది

13. నవంబరు ఇంగ్లాండు వెళ్లిన భారతీయుల ప్రతినిధి బృందం కిల్డోనన్ కేసిల్ అను ఓడలో దక్షిణాఫ్రికాకు ప్రయాణమైంది.

1 డిసెంబరు . భారత దేశంలో శ్రీ రతన్ తాతా దక్షిణాదఫ్రికా సత్యాగ్రహుల సహాయార్థం 25 వేల రూపాయల విరాళం ప్రకటించారు.

## 1910

25. ఫిబ్రవరి భారత దేశపు కేంద్ర పార్లమెంటులో గోఖలే గారు ప్రవేశపెట్టిన గిర్‌మిట్ ప్రథరద్దు తీర్మానం ప్యాసైంది.

1. జూన్ దక్షిణాఫ్రికా యూనియన్‌గా రూపొందింది. అదే రోజున శ్రీ సొరాబ్జీ షాపుర్జీ అడాజడియా ఏడోసారి అరెస్టు అయ్యారు.

4 జూన్ · శ్రీ కెలన్ బెక్ లాలేలో గల తన ఫారమును సత్యాగ్రహులు నివసించుటకు యిచ్చి వేశాడు.

13. జూన్ - 26 మంది సత్యాగ్రహులు ప్రెసిడెంట్ స్టీమరులో దక్షిణాఫ్రికా వచ్చారు

26. జూలై - పోర్చుగ్రీజు ప్రభుత్వ సహాయంతో భారతీయుల్నిదేశాన్నుంచి బహిష్కరించారు. దీనికి వ్యతిరేకంగా లార్డ్సు సభలో లార్డ్ ఎంప్టహిల్ సుదీర్ఘ చర్చకావించారు

30. జూలై - ఇవాళటి వరకు మైనరు తీరిన భారతీయబాలురు పేరు వ్రాయించుకొని పత్రాలు పొందవలసినవారికి కూడా పత్రాలు యివ్వడానికి విరాకరించారు.

22. ఆగస్టు - ఛోటా భాయీా విర్లడి ప్రసిద్ధ టెస్ట్ కేసు జోహాన్స్‌బర్గు కోర్టులో ప్రారంభమైంది. ఆ కేసులో చివరికి ఛోటాభాయి విజయం సాధించాడు.

28. సెప్టెంబరు - శ్రీపోలక్ దేశ బహిష్కరణ శిక్షకు గురి అయిన 85 మంది భారతీయ సత్యాగ్రహులతోబాటు డర్బన్ వచ్చారు
16. అక్టోబరు - కీ॥శే॥ నారాయణస్వామి గర్టరూడ్ బురమన్ అను పేరుగల ఓడలో భారతావని నుంచి వస్తూ డేలాగోవాబేలో చనిపోయాడు.

## 1911

25. ఫిబ్రవరి - యూనియన్ ప్రభుత్వ గెజిట్‌లో ఇమిగ్రేషన్ రిజిస్ట్రేషన్ బిల్లు ప్రచురించబడింది
25. ఏప్రిల్ - ఆ బిల్లు పార్లమెంటులో ఆపివేయబడింది
20. మే - షరతులతో ప్రభుత్వంలో ఒడంబడిక జరిగింది సత్యాగ్రహసంగ్రామం, రెండోసారి వాయిదా పడింది

## 1913

22 మార్చి - భారతీయుల మతాలమీదదాడి జరిగింది. జస్టిస్ సర్ల్ ఒక తీర్పు యిస్తూ ముస్లిం షరియత్ ప్రకారం పెండ్లి జరిగిన మరియమ్మ వివాహం చట్ట విరుద్ధమైనదని ప్రకటించారు
3 ఏప్రిల్ - కొత్త ఇమిగ్రేషన్‌బిల్లు యూనియన్ గెజిట్‌లో ప్రకటించారు.
3 మే - జోహాన్స్‌బర్గులో జరిగిన ఒక బహిరంగసభలో సత్యాగ్రహ ప్రారంభించాలని నిర్ణయం జరిగింది. ఆ వారంలోనే భారత స్త్రీల పక్షాన కూడా అలాంటి నిర్ణయమే హోం మినిష్టరుకి పంపబడింది.
24 మే - గాంధీగారు మరియు హోం మినిష్టరు శ్రీ ఫిషర్ మధ్య 30 ఏప్రిల్ నుంచి జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాలు ప్రచురించబడ్డాయి.
7. జూన్ - పైన తెలిపిన ఉత్తర ప్రత్యుత్తరాల తరువాయి భాగం ప్రచురించబడింది.
21. జూన్ - ఇమిగ్రేషన్ అక్టుకు బ్రిటిష్ చక్రవర్తి అనుమతి లభించింది.
15. జూలై - క్రొత్త చట్టం నిబంధనలన్నీ యూనియన్ గెజిట్‌లో ప్రకటించబడ్డాయి.
1. ఆగస్టు - క్రొత్తచట్టంప్రకారం మూడు అధినివేశ రాజ్యాలలోఅపీలు బోర్డు ఏర్పడ్డాయి ఆ బోర్డులో ఇమిగ్రేషన్ అధికారికూడా ఒక మెంబరయ్యాడు.

13 సెప్టెంబరు - సత్యాగ్రహం ప్రారంభమైంది. ప్రభుత్వానికి, గాంధీగారికి మధ్య జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాలన్నీ ప్రచురించబడ్డాయి.

22 నుంచి 25 అక్టోబరు వరకు నేటాల్ మరియు ట్రాన్స్‌వాలుకు చెందిన అనేక మంది సత్యాగ్రహులైన స్త్రీలు పురుషులు కేకలు బెట్టి, సరిహద్దులు దాటి అరెస్టు అయి జైళ్లకు వెళ్లారు.

16. అక్టోబరు - మూడు పౌండ్ల తల పన్నుకు వ్యతిరేకంగా న్యూకైసల్‌లో ప్రారంభమైన కార్మికుల సమ్మె అంతటా వ్యాపించింది

6 నవంబరు - గాంధీగారు సమ్మెదారులతో కలిసి ట్రాన్స్‌వాల్‌లో ప్రవేశించారు.

11 నవంబరు - గాంధీగారికి డండీలో 9 మాసాల శిక్ష పడింది

28 నవంబరు - భారత వైస్రాయి అభిభాషణ.

11. డిసెంబరు - కమిషన్ నియమించబడింది

19 డిసెంబరు - గాంధీగారు శ్రీ కేలన్‌బెక్, శ్రీ పోలక్ జైలునుంచి విడుదల అయ్యారు.

16 ఫిబ్రవరి - ఒడంబడిక ప్రకారం జైళ్ల నుంచి సత్యాగ్రహ ఖైదీలందరూ విడుదల అయ్యారు.

18 మార్చి - కమిషన్ రిపోర్టు వెలువడింది.

3 జూన్ - ఇండియన్స్ రిలీఫ్ బిల్లు ప్రచురించబడింది.

30 జూన్ - ప్రభుత్వంతో చివరి ఒడంబడిక జరిగింది

20. జులై - 45 సంవత్సరాల వయస్సులో గాంధీగారు కస్తూరిబా మరియు కెలన్‌బెక్ గారల వెంట దక్షిణాఫ్రికాను పూర్తిగా వదిలివెళ్లటకు నిర్ణయించి ఇంగ్లాండుకు బయలుదేరారు

**- సమాప్తం -**